బాలవిజ్ఞానగ్రంథమాల. ౪.

# శతకపద్యమంజరి.

(ఐదవతరగతి)

(పద్యవాచకము)



సంపాదకుఁడు

విమర్శాదర్శక

విజ్ఞానగ్రంథమాల. ౭.
[illegible]

# శతకపద్యమంజరి

(ఐదవ తరంగతి.)

(పద్యవాచకము.)



సంపాదకుండు

విమర్శాదక్షక

నడకుదుటి వీరరాజకవి

పిఠాపురము.

# పీ ఠి క.

దేశభాషాభివృద్ధికిఁ బూర్వవాఙ్మయమే పునాదివంటిది. మేధాశక్తిని బెంపొందించుటకై మనపూర్వులు మొట్టమొదటి దనుకఁ బద్యగ్రంథములనే రచియించుచు వచ్చిరి.

విద్య నభ్యసింపఁ గోరు బాలురును, బాలికలును బాల్యమునుండియు నలవఱచుకొనవలసిన సుగుణములలో నీతియు, దైవభక్తియుఁ బ్రధానములైనవి. మేధాశక్తితోపాటు పై సుగుణములను బెంపొందించుటకు మనపూర్వులు, మనోహరముగను, జాతీయముగను, నిత్యానుభవజ్ఞాపకములుగను నుండునట్లు, సులభశైలిని రచియింపఁబడిన శతకములు ననేకము వానిని దొలుదొలుతఁ దమతమ బిడ్డలచే పఠింపఁజేయుచు వచ్చిరి. ఈయాచారము మొన్న మొన్నటివఱకు వీథిబడులలోఁ బ్రాముఖ్యముగ నుండెడిది. ప్రాథమికపాఠశాలలు నెలకొల్పఁబడిన ప్రథమదినములలోనైతె నిప్పటి యుపాధ్యాయులు నీతిశాస్త్ర పుస్తకములతోపాటు భాషాభివృద్ధికరములగు పద్యరత్నములను ప్రధానాంగముగ వాడుచువచ్చిరి.

కాలక్రమమున నాపద్ధతి మారెఁ, యిప్పటి ప్రభుత్వపాఠ్య గ్రంథములలో (వాచకములలో) చేరియున్న కొన్ని పద్యములు

సూత్రము కడపట చేర్పఁబడు నాచారము మేర్పడినది. కాని, యింత పిల్లలభాషాజ్ఞానాభివృద్ధికిని, ననుదినజీవితానుభవము కును దగినంత సాధకముగాఁ గనఁబడకున్నది. దానిం జేసి నా మిత్రులగు కొందఱు స్థానికాధికారులయు విద్యాధికారులయుఁ బ్రోత్సాహమున పూర్వశతకాదివాఙ్మయమునుండి యాయా తరగతుల విద్యార్థుల కనుకూలములుగ నుండునట్లు పద్యముల నేర్చి కూర్చి 'శతకపద్యమంజరి' యను పేరిట నైదుపుస్తకములుగఁ బ్రకటించితిని.

విద్యాశాఖాధికారులును, దేశభాషాభిమానులగు స్థానికవిద్యాధికారులును నాయీపరిశ్రమమునకుఁ దగిన ప్రోత్సాహము నొసఁగుదురని విశ్వసించుచున్నాఁడను.

ప్రకాశకుఁడు.

విషయసూచిక.



పుట.



# శతకపద్యమంజరి

నాల్గవ భాగము.

## ౧ భర్తృహరినీతిశతకము

తే. సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్చు
గౌరవ మొసంగు జనులకుఁ గలుష మడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁ జిత్తవిస్ఫూర్తిఁ జేయు
సాధుసంగంబు సకలార్థ సాధనంబు. 1

తే. ప్రాణిలోకంబు సంసారపతిత మగుట
వసుధపై గిట్టి పుట్టనివాఁడు గలఁడె
వానిజన్మంబుసఫల మెవ్వానివలన
వంశ మధికోన్నతి వహించి వన్నె కెక్కు. 2

తే. కుసుమగుచ్ఛంబునకుఁబోలెఁ బొసఁగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు
సకలజనమస్తక ప్రదేశముల నెస
వనమునం దైన జీర్ణభావంబు గనుట. 3

తే. అర్కకాంత మచేతనం బయ్యు సవితృ
పాదములు సోఁకినంతనే ప్రజ్వరిల్లుఁ
గాన నభిమానవంతుఁ డెందైన శత్రు
కృతతిరస్కార మెట్లు సహింపనేర్చు. 4

క. ఏనరునకు విత్తము గల
దానరుఁడు కులీనుఁ డధికుఁ డార్యుఁ డతండే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి
నానాగుణగణము కాంచనంబున నిలుచున్. 5

క. దానము భోగము నాశము
పూనికతో మూఁడుగతులు భువి ధనమునకున్
దానము భోగము నెఱుఁగని
దీనుని ధనమునకుఁ గతి తృతీయమె పొసఁగున్. 6

తే. విద్యచే భూషితుండయి వెలయుచున్నఁ
దొడరి వర్జింపఁబడుఁ జుమీ దుర్జనుండు
చారుమాణిక్యభూషిత శస్త్రమస్త
కం బయినపన్నగము భయంకరము గాదె? 7

క. మొదలఁ జూచినఁ గడు గొప్ప పిదపఁ గుఱచ
యాదిఁ గొంచెము తర్వాత నధిక మగుచుఁ
దనరు దినపూర్వపరభాగజనిత మయిన
ఛాయపోలికఁ గుజనసజ్జనుల మైత్రి.

తే. తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరుఁ ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖులమనసు రంజింపరాదు. 9

క. తెలియని మనుజుని సుఖముగఁ
దెలుపందగు; సుఖతరముగఁ దెలుపఁగ వచ్చుం
దెలిసినవానిని; దెలిసియుఁ
దెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవుని వశమే? 10

చ. తెలివి యొకింత లేనియెడ
దృప్తుఁడనై కరిభంగి సర్వమున్
దెలిసితి నంచు గర్వమున
మిన్ విహరించితిఁ దొల్లి యుబ్బుచు
జ్వలితమనీషులైనపండితుల
సన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగి
తీఱం గతమయ్యె నితాంతగర్వమున్. 11

తే. ప్రభులు పండితులగు వారివలన గర్వ
మేలన మానుఁడు వారు మీకలిమిఁ దృణము
గాఁగఁ బోలింపలేమి; మృణాళగుణము
మదజలవారణములకు వారణమె! 12

ఉ. ఆపదలందు ధైర్యగుణ
మంచితసంపదలందు దాల్మియున్
భూపసభాంతరాళమునఁ
బుష్కలవాక్చతురత్వ మాజి బా
హాపటుశక్తియున్; యశము
నం దనురక్తియు; విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్; బ్రకృతి
సిద్ధగుణంబులు సజ్జనాళికిన్. 13

తే. సంపదలు గల్గునెడ మహాజనులహృదయ
మభినవోత్పలకోమలం బగుచు నెలయు
నాపదలు వొందునపుడు మహామహీధ
రాశ్మసంఘాతకర్కశం బై తనర్చు. 14

ఉ. నీరము తప్తలోహమున
నిల్చి యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళి
నీదళ సంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁ బడి మ
ణిత్వము గాంచు సమంచితప్రభం
బౌరుషవృత్తు లిట్లధమ
మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్. 15

గీ. తరువు లతితరఫలభారగురుతఁ గాంచు
నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుఁ
డుద్ధతులుగారు బుధులు సమృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము. 16

గీ. అమరుఁ జెవి శాస్త్రమునఁ, గుండలమునఁ గాదు;
వలయమున నొప్పు, దీవిచే వెలయుఁ బాణి;
యురుదయాఢ్యులమేను పరోపకార
శీలన రాణించు, గంధంబువలనఁ గాదు. 17

తే. ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ
గుముద హర్షంబుఁ గావించు నమృతసూతి
యర్థితుఁడు గాక జలమిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితాచరణమతులు. 18

తే. అఘమువలన మరల్చు హితార్థకలితుఁ
జేయు గోప్యంబు దాఁచుఁ బోషించు గుణము
విడువఁ డాపన్ను లేవడివేళ నిచ్చు
మిత్రుఁ డీలక్షణంబుల మెలఁగుచుండు. 19

తే. తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత
వెఱచిరే ఘోరకాకోలవిషముచేత
విడిచిరే యత్న మమృతంబు పొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు. 20

మ. ఒకచో నేలను బవ్వళించు, నొకచో
నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో
నుత్కృష్టశాల్యోదనం
బొకచో బొంతధరించు నొక్కొకతఱిన్
యోగ్యాంబరశ్రేణి లె
క్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుః
ఖంబున్ సుఖంబున్ మదిన్. 21

గీ. నియతిచేతను వంచితుం డయినధైర్య
పరుని ధైర్యగుణంబు మాన్పంగఁ దరమె ?
క్రిందు సేయఁగఁ బడినట్టి కృష్ణపథుని
కీల లెందైన మీఁదుగాఁ గెరలుఁ గాదె ? 22

క. కందుకమువోలె సుజనుఁడు
గ్రిందంబడి మగుడ మీఁదికి న్నెగయు సుమీ
మందుఁడు మృత్పిండమువలె
గ్రిందం బడి యడఁగియుండుఁ గృపణత్వమునన్. 23

తే. ఎవ్వనికి నిజ్జగంబున నెంతఫలము
దైవకృత మగు నది పొందుఁ దప్ప కతనిఁ,
గారణముగాదు పసుఁబ్రోపు; ఘనునిఁ జేరు
చాతకమువాతఁ బడు సల్ప జలకణములు. 24

# శ్రీ భాస్కర శతకము

ఉ. అక్కఱపాటు వచ్చు సమ
　　　యంబునఁ జుట్టము లొక్కరొక్కరిన్
మక్కువ నుద్ధరించుటలు
　　　మైత్రికిఁ జూడఁగ యుక్తమే సుమీ
యొక్కట నీటిలో మెరక
　　　నోడలు బండ్లను బండ్లు నోడలుం
దక్కక వచ్చుచుండుట ని
　　　దానము గాదె తలంప భాస్కరా. 1

చ. అవనివిభుండు నేరుపరి
　　　యై చరియించినఁ గొల్చువార లె
ల్లవగుణులైన నేమి పను
　　　లన్నియుఁ జేకుఱు వారిచేతనే
ప్రవిమల నీతిశాలి యగు
　　　రామునికార్యము మర్కటంబులే
తవిలియొనర్పవే ? జలధి
　　　దాఁటి సురారులఁ ద్రుంచి భాస్కరా. 2

ఉ. ఆరయ నెంతనేరుపరి
　　　యై చరియించిన వానిదాపునన్
గారవ మొప్పఁ గూర్చు నుప
　　　కారి మనుష్యుఁడు లేక మేలు చే

కూర దదెట్లు? హత్తుగడ
గూడునె చూడఁ బదాఱువన్నె బం
గారములోన నైన వెలి
గారము గూడకయున్న భాస్కరా. 3

ఉ. ఈజగమందుఁ దా మనుజుఁ
డెంత మహాత్మకుఁ డైన దైవమా
తేజము తప్పఁ జూచునెడఁ
ద్రిమ్మరి కోల్పడు, నెట్లన న్మహా
రాజకుమారుఁ డైన రఘు
రాముఁడు గాల్నడఁ గాయలాకులున్
భోజనమై తగ న్వనికిఁ
బోయి చరింపఁడె? మున్ను భాస్కరా. 4

చ. ఉరుగుణవంతుఁ డొడ్లు దన
కొం డపకారము సేయునప్పుడుం
బరహితమే యొనర్చు నొక
పట్టుననైనను గీడుఁ జేయఁగాఁ
నెఱుఁగఁడు నిక్కమే కద య
దెట్లనఁ గవ్వముఁ బట్టి యెంతగాఁ
దరువఁగఁ జొచ్చినం బెరుఁగు
తాలిమి నీయదె? వెన్న భాస్కరా. 5

ఉ. ఊరక సజ్జనుం డొదిఁగి
యుండిననైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యప
కారముచేయుట వానివిద్యగా!
చీరెలు నూఱుటంకములు
చేసెడివైనను బెట్టె నుండఁగాఁ
జేరి చినింగిపోఁ గొఱుకు
చిమ్మట కేమిఫలంబు ? భాస్కరా ! 6

ఉ. ఎట్టుగఁ బాటుపడ్డ నొక
యించుక ప్రాప్తియు లేక వస్తువుల్
పట్టుపడంగ నేరవు, ని
బద్ధి; సురావళిఁ గూడి రాక్షసుల్
గట్టుపెకల్చి పాల్కడలిఁ
గవ్వము చేసి మథించి రంతయున్
వెట్టియెకాక యే మనుభ
వించిరి వా రమృతంబు ? భాస్కరా ! 7

ఉ. ఎడ్డెమనుష్యుఁ డే మెఱుఁగు
నెన్నిదినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁ గల
తోరపు వర్తనలెల్లఁ బ్రజ్ఞ నే

ర్పడ్డ వివేకిరీతి రుచి
పాకము నాలుక గా కెఱుంగునే
తెడ్డది? కూరలోఁ గలయఁ
ద్రిమ్మరుచుండిన నైన భాస్కరా! 8

ఉ. కానక చేరఁ బోల దతి
కర్ముఁడు నమ్మిక లెన్ని చేసినం
దా నది నమ్మి వానికడ
దాయఁగఁబోయిన హాని వచ్చు; న
చ్చో నది యెల్లనం గొఱఁకు
చూపుచు నొడ్డినబోను మేలుగాఁ
బోనని కాన కాసపడి
పోవుచుఁ గూలదె కొక్కు భాస్కరా! 9

చ. కులమున నక్కడక్కడ న
కుంఠితధార్మికుఁ డొక్కఁడొక్కఁడే
కలిగెడుఁగాక పెండలము
గల్గఁగనేరదు; చెట్టుచెట్టునన్
గలుగఁగనేర్చునే గొడుగు
కామలు చూడఁగ నాడనాడ నిం
పలరఁగ నొక్కటొక్కటి న
యంబునఁ బండును గాక భాస్కరా! 10

చ. ఘనుఁ డొకవేళఁ గీడ్పడినఁ
గ్రమ్మఱ నాతని లేమి వాపఁగాఁ
ఘనుఁడగు నొక్క సత్ప్రభువు
గాక నరాధము లోప రెందఱుం
బెనుచెఱు వెండినన్ మఱలఁ
బెల్లున మేఘుఁడు గాక నీటితోఁ
దనుపఁ దుషారముల్ శతశ
తంబులు చాలు నటయ్య భాస్కరా! 11

ఉ. చక్కఁ దలంపఁగా విధని
షేధంబున నిల్పి చేత నొక్కఁడాఁ
టెక్కి యవస్థలం బొరలఁ
జెప్పఁగరాని మహాబలాఢ్యుఁడున్;
మిక్కిలి నష్టసంపదల
మీఱిన గంధగజంబు మావటీఁ
డెక్కి యదల్చి కొట్టి తుది
నుంచిన నుండదె యోర్చి భాస్కరా! 12

చ. చను వది యెంత గల్గిన ర
సజ్ఞత యించుక చాలకున్న యా
చనువు నిరర్థకంబు గుణ
సంయుతు లెవ్వరు నొప్ప రెచ్చటం;

బదనుగ మంచికూర నల
 పాకము చేసిన నైన నందు నిం
పొదవెడు నుప్పు లేక రుచి
 పుట్టఁగ నేర్చునటయ్య? భాస్కరా! 13

చ. తగిలి మదంబుచే నెదిరిఁ
 దన్ను నెఱుంగక దొడ్డవానితోఁ
బగఁగొని పోరుటెల్ల నతి
 పామరుఁడై చెడుటింతె కాక తా
నెగడి జయింపనేరఁ డది
 నిక్కము, తప్పదు ధాత్రిలోపలన్
దెగి యొకకొండతోఁ దగరు
 దీకొని తాఁకిన నేమి? భాస్కరా! 14

చ. తడవఁగరాదు దుష్టగుణుఁ
 దత్త్వ మెఱుంగక యెవ్వరైన నా
చెడుగుణ మిట్లు వల్వదని
 చెప్పినఁ గ్రక్కునఁ గోపచిత్తుఁడై
కడుఁ దెగఁ జూచుఁగా; మఱుఁగఁ
 గాఁగిన తైలము నీటిబొట్టుపైఁ
బడునెడ నాక్షణం బెగసి
 భగ్గున మండక యున్నె? భాస్కరా! 15

చ. తనకు నదృష్ట రేఖ విశ
దంబుగఁ గల్గిన గాని లేనిచో
జనునకు నెయ్యెడం బరుల
సంపదవల్ల ఫలంబు లేమిగా;
కనుఁగవ లెస్సగాఁ దెలివి
గల్గినవారికిఁగాక గ్రుడ్డికిన్
కనుపడు నొప్పు వెన్నెలలు
గాయఁగ నం దొకరూపు; భాస్కరా! 16

ఉ. తాలిమితోడఁ గూరిమిఁ గృ
తఘ్నున కెయ్యెడ నుత్తమోత్తముల్
మే లొనరించిన్ గుణము
మిక్కిలి కీడగుఁ; బాముపిల్లకున్
బాలిడి పెంచిన న్విషము
వాయఁగ నేర్చునె దానికోఱలం
జాలఁగ నంతకంత కొక
ఛాయను హెచ్చునుగాక భాస్కరా! 17

ఉ. దక్షుఁడు లేనియింటికిఁ బ
దార్థము వేఱొకచోటినుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బ
లాయన మై చనుఁ గల్ల గాదు, వ

తృష్ణము వాఁగులుఁ వడిఁద
 లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యత్నయు మైనగండి తెగి
 నట్టితటాకములోన భాస్కరా! 18

ఉ. దానము సేయఁగోరిన వ
 దాన్యున కీయఁగ శక్తిలేనిచో
నైనఁ బరోపకారమున
 కై యొకదిక్కునఁ దెచ్చియైన నీఁ
బూనును; మేఘుఁ డంబుధికిఁ
 బోయి జలంబులఁ దెచ్చి యీయఁడే
వాన, సమస్తజీవులకు
 వాంఛిత మింపెసలార భాస్కరా! 19

చ. నుడువుల నేర్పుచాలని మ
 నుష్యుఁ డెఱుంగక తప్పనాడినం
గడుఁ గృపతోఁ జెలంగుదురు
 కాని యదల్పరు తజ్ఞులెల్లఁ; ద
ప్పడుగులు వేయుచు న్నడచు
 నప్పుడు బాలుని ముద్దుసేయఁగాఁ
దొడఁగుదు రింతెకాని పడఁ
 ద్రోయుదురే యెవరైన భాస్కరా! 20

ఉ. పలుచని హీనమానవుఁడు
పాడిఁ దలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుఁగాని, మతి
భాసురుఁ డైనగుణప్రపూర్ణుఁ డ
ప్పలుకులఁ బల్కఁబోవఁడు; ని
బద్ధిగ నెట్లన, వెల్తికుండఁ దాఁ
దొలఁకుచు నుండుఁగాని మతి
దొల్కునె నిండుఘటంబు భాస్కరా! 21

ఉ. పూరితసద్గుణంబు గల
పుణ్యున కించుక రూపసంపదల్
దూరములైన వానియెడ
దొడ్డగఁ జూతురు బుద్ధిమంతు లె
ట్లారయ గొగ్గులైన మతి
యందుల మాధురిఁ జూచికాదె ఖ
ర్జూరఫలంబులం బ్రియము
చొప్పడ లోకులు గొంట భాస్కరా! 22

ఉ. బలయుతుఁ డైనవేళ నిజ
బంధుఁడు తోడ్పడుఁగాని యాతఁడే
బలము తొలంగెనేని తన
పాలిటిశత్రుం, వ దెట్లు పూర్ణుఁ డై

జ్వలనుఁడు కానఁ గాల్చుతఱి
సఖ్యముఁజూపును వాయుదేవుఁ; డా
బలియుఁడు సూక్ష్మదీప మగు
పట్టున నార్పదె గాలి భాస్కరా! 23

ఉ. బల్లిదుఁ డైనసత్ప్రభువు
పాయక యుండినఁగాని రచ్చలోఁ
జిల్లరివారు నూఱుగురు
సేరినఁ దేజము గల్గ దెయ్యెడన్
జల్లనిచందురుం డెడసి
సన్నపుఁజుక్కలు కోటి యున్న రం
జిల్లునె వెన్నెలల్ జగము
చీకటు లన్నియుఁ బాయ భాస్కరా! 24

ఉ. రాకొమరుల్ రసజ్ఞుని ది
రంబుగ మన్నన నుంచినట్లు భూ
లోకమునందు మూర్ఖుఁ దమ
లోపల నుంపరు నిక్కమేకదా!
చేకొని ముద్దుగాఁ జదువు
చిల్కను బెంతురు గాక పెంతురే
కాకము నెవ్వరైన శుభ
కారణ సన్మునిసేవ్య భాస్కరా! 25

ఉ. లోకములోన దుర్జనుల
లోఁతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు చేరినం గవయుఁ
జూతురు చేయుదు రెక్కసక్కెముల్
కోకిలఁ గన్నచోట గుమి
గూడి యసహ్యపుఁగూఁత లార్చుచుం
గాకులు తన్నవే తతిమి
కాయము తల్లడమంద భాస్కరా! 26

ఉ. వట్టుచుఁ దండ్రి యత్యధమ
వర్తనుఁ డైనను గాని వానికిం
బుట్టినపుత్త్రకుండు తన
పుణ్యవశంబున దొడ్డధన్యుఁ డౌ,
నెట్టన, మఱ్ఱివిత్తు మును
పింతయుఁ గొంచెము దానఁ బుట్టినా
చెట్టు మహోన్నతత్వమును
జెందదె శాఖల నిండి భాస్కరా! 27

చ. పలవదు క్రూరసంగతి య
వశ్య మొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియె కాక యెక్కువలు
గూడవు, తమ్ములపాకులోపలం

గలసినసున్న మించుకయు
కాక మఱించుక యెక్కువైనచో
నలుగడఁ జుఱ్ఱుచుఱ్ఱుమని
నాలుక పొక్కకయున్నె భాస్కరా! 28

చ. సరసగుణప్రపూర్ణునకు
సన్నపుదుర్గుణ మొక్కవేళయం
దొరసిన నిట్లు నీకుఁ దగు
నో యని చెప్పిన మాననేర్చుఁగా;
బురద యొకించుకంత తముఁ
బొందినవేళలఁ జిల్లవిత్తుపై
నొరసిన నిర్మలత్వమున
నుండవె నీరములెల్ల భాస్కరా! 29

చ. సరసదయాగుణంబు గల
జాణ మహిం గడునొచ్చియుండియుం
దఱచుగ వాని కాసపడి
దాయఁగ వత్తురు లోకు, లెట్లనం
జెఱకురసంబు గానుఁగను
జిప్పిలిపోయినమీఁదఁ బిప్పి యై
ధరఁ బడియున్నఁ జేరవె ము
దంబునఁ జీమలు పెక్కు భాస్కరా! 30

చ. స్ఫురతరకీర్తిమంతు లగు
పుత్త్రులఁ గాంచినఁగాక మూఢము
ష్కరులఁ గనంగఁ దేజములు
గల్గవుగా, మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శు
భస్థితిఁ బెట్టినఁగాక గాజులుం
గరములు పెట్టినందున వి
కాసము గల్గునటయ్య! భాస్కరా! 31

ఉ. కట్టడ యైనయట్టినిజ
కర్మము చుట్టుచువచ్చి యేగతిం
బెట్టినఁ బెట్టిన ట్లనుభ
వింపక తీఱదు; కాళ్లు మీఁదుగాఁ
గిట్టక వ్రేలుఁ డంచుఁ దల
క్రిందుగఁ గట్టిరె యెవ్వరైన నా
పెట్టున గబ్బిలంబులకుఁ
జేరినకర్మము గాక భాస్కరా! 32

---

# ౩ దాశరథిశతకము.

ఉ. శ్రీయుత జానకీరమణ
చిన్మయరూప రమేశ రామ నా
రాయణ పాహి పాహి యని
ప్రస్తుతిఁ జేసితి నామనంబునం
బాయక కిల్బిషవ్రజ వి
పాటన మొందగఁ జేసి సత్కళా
దాయఫలంబు నా కియవె
దాశరథీ! కరుణాపయోనిధీ! 1

ఉ. రామవిశాల విక్రమ ప
రాజిత భార్గవ రామ సద్గుణ
స్తోమ పరాంగనా విముఖ
సువ్రతకామ వినీల నీరద
శ్యామ కకుత్స్థవంశ కల
శాంబుధిసోమ సురారి దోర్బలో
ద్దామ విరామ భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ! 2

చ. అజునకుఁ దండ్రివయ్యు సన
కాదులకుం బరతత్త్వ మయ్యు స
ద్ద్విజముని కోటికెల్ల కుల
దేవతవయ్యు దినేశవంశభూ

భుజాలకు మేటినయ్యెఁ బరి
పూర్ణుఁడవై వెలుఁగొందు పక్షిరా
డ్ధ్వజ మిమ్ముఁ బ్రస్తుతించెదను
దాశరథీ! కరుణాపయోనిధీ! 3

చ. హాలికునకున్ హలాగ్రమున
నర్థము చేకుఱుభంగి దప్పిచే
నలమటఁ జెందువానికి సు
రాపగలో జల మబ్బినట్లు దు
ర్మలినమనోవికారి యగు
మర్త్యుని నన్నొడఁ గూర్చి నీపయిం
దలఁపు ఘటింపఁ జేసితివి
దాశరథీ! కరుణాపయోనిధీ! 4

చ. పరమదయానిధే పతిత
పావననామ హరే యటంచు సు
స్థిరమతులై సదా భజన
సేయు మహాత్ముల పాదధూళి నా
శిరమునఁ దాల్తు మీ రటకుఁ
జేరకుఁడంచు యముండు కింకరో
త్కరముల కానఁ బెట్టునఁట
దాశరథీ! కరుణాపయోనిధీ! 5

ఉ. చిక్కని పాలపై మిసిమిఁ
జెందిన మీఁగడ పంచదారతో
మెక్కినభంగి నీవిమల
మేచకరూపసుధారసంబు నా
మక్కువ పల్లెరంబున స
మాహిత దాస్యము నేటి దోయిటం
దక్కె నటంచు జుర్రెదను
దాశరథీ! కరుణాపయోనిధీ! 6

ఉ. పెంపను దల్లివై కలుష
బృంద సమాగమ మొందకుండ ర
క్షింపను దండ్రివై మది వ
సించుచు నాదిజరోగము ల్నివా
రింపను వెజ్జవై కృప గు
ఱ్ఱించి పరంబు దిరంబు నాఁగ స
త్సంపద లియ్య నీవె గతి
దాశరథీ! కరుణాపయోనిధీ! 7

ఉ. కుక్షి నజాండపంక్తు లొనఁ
గూర్చి చరాచర జంతుకోటి సం
రక్షణ సేయుచుండి యవి ప
రంపర నీతినయుండ వైన నా

పక్షము నీవు గావలదె
పాపము లెన్ని యొనర్చినఁ జగ
ద్రక్షక కర్త నీవెకద
దాశరథీ! కరుణాపయోనిధీ! ౮

ఉ. అగణితజన్మకర్మదురి
తాంబుధిలో బహుదుఃఖవీచిక
ల్దెగిపడ నీఁద లేక జగ
దీధవ నీపదభక్తి నావచేఁ
దవిలి తరింపఁగోరితి ప
దంపడి వాడు భయంబు మాన్పవే
తగదని చిత్తమం దిడక
దాశరథీ! కరుణాపయోనిధీ! ౯

ఉ. దాఁచిన చుట్టమా శబరి
దాని దయామతి నేలినావు, నీ
దాసుని దాసుఁడా గుహుఁడు
తావక దాస్య మొసంగినావు, నేఁ
జేసిన పాపమా వినుతిఁ
జేసినఁ గావవు, కావవయ్య నీ
దాసులలోన నే నొకఁడ
దాశరథీ! కరుణాపయోనిధీ! 10

ఉ. దీక్ష వహించి నాకొఱకుఁ
దీనుల నేఁదఁగఁ గాచితో జగ
ద్రక్షక మున్ను; నా ద్రుపద
రాజతనూజ తలంచినంతనే
యక్షయమైన వల్వ లిడి,
తక్కట నా మొఱ నాలకించి ప్ర
త్యక్షము గావదేమిటికి
దాశరథీ! కరుణాపయోనిధీ! 11

ఉ. చరణము సోఁకినట్టిశిల
జవ్వని యావఁగ నొక్కవింత, సు
స్థిరముగ నీటిపై గిరులు
దేలిన దొక్కటి వింత, గాన మీ
స్మరణఁ దనర్చు మానవులు
సద్గతిఁ జెందిన దెంత వింత, యీ
ధరను ధరాత్మజారమణ!
దాశరథీ! కరుణాపయోనిధీ! 12

ఉ. దైవము తల్లి దండ్రి తగు
దాత గురుండు సఖుండు నిన్నెకా
భావన సేయుచున్నతఱిఁ
బాపములెల్ల మనోవికారదు

ర్భావితుఁ జేయు చున్నవి కృ
పామతి వై నను గావుమీ జగ
త్పావనమూర్తి! భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ! 13

ఉ. వాసవరాజ్య భోగసుఖ
వార్ధిని దేలు ప్రభుత్వ మబ్బినన్,
ఆసకు మేరలేదు కన
కాద్రిసమానధనంబుఁ గూర్చినం
గాసును వెంటరాదు కని
కానక చేసిన పుణ్యపాపముల్
వీసరపోవ నీవు పది
వేలకుఁ జాలు భవంబు నొల్ల నీ
దాసునిఁగాఁగ నేలుకొను
దాశరథీ! కరుణాపయోనిధీ! 14

ఉ. కరములు మీకు మ్రొక్కులిడఁ
గన్నులు మిమ్మునె చూడ జిహ్వ మీ
స్మరణఁ దనర్ప వీనులుం భ
వత్కథల న్వినుచుండ నాస మీ
యఱుతను బెట్టు పూసరుల
కాసగొనం బరమార్థసాధనో

త్కారమతి చేయవే కృపను
దాశరథీ! కరుణాపయోనిధీ! 15

ఉ. నోఁచిన తల్లిదండ్రికిఁ ద
నూభవుఁ డొక్కఁడె చాలు మేటి; చే
చాఁచనివాఁడు వే ఱొకఁడు
చాఁచిన లే దన కిచ్చువాఁడు నో
రాఁచి నిజంబె కాని పలు
కాడనివాఁడు రణంబులోన మై
దాఁచనివాఁడు భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ! 16



# ౮ భారతనీతులు

గీ. విద్య యొసఁగును వినయంబు వినయమునను
బడయుఁ బాత్రత, పాత్రతవలన ధనము
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖంబు లందు నరుఁడు. 1

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్కసత్యమును నిరుగడలం
దులనిడి తూఁపఁగ సత్యము
వలననె మొలుసూపు గౌరవంబున పేర్మిన్. 2

క. శరణం బని వచ్చిన భీ
కర శత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగవలయుం
గరుణాపరుల తెఱం గిది
యెరవుగ నరిగావు దీని కేధర్మంబుల్. 3

క. అనుపమనియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు సే
సినవారికంటె నర్థో
ద్ధనుఁడ కరం బధికుఁ డండ్రు తత్త్వవిధిజ్ఞుల్. 4

క. అలిగిన నలుగక యొగ్గులు
పలికిన మఱి వినని యట్లు ప్రతివచనంబుల్
వలుకక బన్నమువడి యెదఁ
దలఁపక యున్నతఁడు చూవె ధర్మజ్ఞుఁ డిలన్. 5

క. ఉత్తమకులజుఁడు సుగుణా
యత్తుఁడు సస్నేహమతియు నగుమిత్త్రునకుం
జిత్త మెలర్పఁ జెలంగునఁ
బాత్రుమనఁగవలయు శుభముఁ బొందవలసినన్. 6

ఆ. కుటిలమార్గు లయిన కుత్సితకితవుల
తోడఁ గడఁగిజూద మాడఁ జనదు
చావఁ జేసి యర్థ ధర్మ వివర్జితు
లగుదు రెట్టివారు జగములోన. 7

క. కలిమియ చుట్టలఁ జేర్పుం
గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
జ్జ్వలతఁ గనిపించుం గలిమియ
పలువురు సద్బుద్ధి యనఁగఁ బరగం జేయున్. 8

క. తిలలును నీళ్ళును వస్త్రం
బులుఁ బుష్ప సుగంధవాసమున సౌరభముం
బొలుపెసఁగఁ దాల్చుఁ గావున
నలయక సత్సంగమమున నగు సద్గుణముల్. 9

తే. బలము గలవానిఁ బలువురు బలవిహీను
లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి
మధువుఁ గొన నుత్సహించిన మనుజుఁ బట్టి
కుట్టి నిర్జించు మధుకర కులమునట్లు. 10

ఆ. కీర్తిలేని వానికిని జీవనంబు ని
రర్థకంబు సూనె యవనిమీఁద
నిత్య మయిన ధనము నిర్మల కీర్తియె
యట్టి కీర్తి వడయు టర్హమంజె ? 11

ఆ. కమియఁ బండకుండఁ గాయఁ గోసినఁ జవి
చేఱు కాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వ మగుదుఁ గోయ ఫలమిచ్చుఁ జెడదు బీ
జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 12

తే. వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు
ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల. 13

తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ, దేఁటి
పువ్వుఁ దేనియఁ గ్రోలెడుపోల్కిఁ, నెదురు
కందకుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁబోలె మొదలంటఁ బొడువఁజనదు. 14

క. పరులధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులు లేని వేదనం బడు నధిపా ! 15

క. మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగుపలు
కొనరఁగ బలుకునది ధర్మయుతముగ సభలన్. 16

ఆ. నీతి లేనివాని నిందింత్రు లోకులు
లేదు సేగి లాఁతి లేక యున్నఁ
గాన మానవుండు పూనిక నయవిద్య
గడనసేయ మొదలఁ గడఁగవలయు. 17

క. జనులకు నొడఁబాటగు విధ
మున నడచుచు లోకనింద్యముల నుడుగుచు మీ
ఱిన యొకనికలిమి కులుకక
మనుజులతోఁ బొందిపొసఁగి మను టొప్పు నృపా. 18

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడు మే
లొనరించుఁ గీడొకించుక
యును దనదెసఁ దోఁపనీక యుడుగుచువచ్చున్. 19

క. పురుషుండు రెండుదెఱఁగుల
ధర నుత్తముఁ డనఁగఁ బరగుఁ దా నెయ్యెడలం
బరుషములు పలుక కసికిన్
దురితంబులు వొంచియుపనులు దొఱఁగుటకతనన్. 20

# ౫ పతివ్రతాధర్మములు

క. పతి తన కేమగడయ కాఁ
బతియానతి మౌళిఁ బూని పతిచిత్తం బే
గతి నుండు నట్ల మెలఁగెడు
సతి గల్గినఁ బుణ్యగతి సుసాధ్యము పతికిన్. 1

ఆ. భాండశుద్ధి గలిగి భక్తి దేవాతిథి
పూజనముల మెప్పుఁ బొంది మేలి
వర్తనమున మెలఁగువనిత ప్రాణేశుతో
నుభయలోకసుఖము లొంది యెసఁగు. 2

ఆ. ఒక్కమన్ననతో నున్న నొల్లకున్నఁ
గరము నెయ్యుఁడై యున్నను గాకయున్న
మగఁడు ప్రియతముఁ డని యుండు మానవతికి
నెల్లలోకసుఖంబులు నెదురువచ్చు. 3

క. పతిపరిచర్యాపరిణత
గతి లోకము మేలు కీడు గనియుండు పతి
వ్రతలు జగన్నుతగుణవతు
లతులితసుఖకీర్తు లెందు నందుదు రబలా! 4

క. నడవడి తప్పక యుండినఁ
గడునిర్ధనుఁ డైనఁ బతియె గతియును విను మె
క్కుడుబంధుండును బ్రియుఁడుం
బడఁతులకుం బరమగురుఁడుఁ బరదేవతయున్. 5

# ౬ పొడుపుపద్యములు

ఆ. కాలిమీఁద మ్రాను కడు రమ్యమై యుండు
మ్రానిమీఁద లతలు మలయుచుండు
లతలమీఁద వ్రేళ్లు లలి నాట్యమాడును
దీనిభావ మేమి? తిరుమలేశ!

(వీణ)

ఆ. జాతిమీఁద మ్రాను రాపాడుచుండఁగా
మ్రానిమీఁద వ్రేళ్లు మలయుచుండు
వ్రేళ్లమీఁద నీళ్లు వెదచల్లఁబడునయా
దీనిభావ మేమి? తిరుమలేశ!

(గంధముతీయుసాన)

ఆ. ఎద్దు నెక్కి తిరుగు, నీశ్వరుండును గాఁడు
నాల్గుమోము లుండు, నలువ గాఁడు
గర్భయుగము గలిగి కడుమ్రింగు ధాన్యంబు
దీనిభావ మేమి? తిరుమలేశ!

(పెఱికాటపుధాన్యపుసంచి)

ఆ. దేహ మెల్లఁ గన్నులు దేవేంద్రుఁడును గాఁడు
నరుఁడు మోయకున్న నడవలేఁడు
తాను జీవి గాఁడు తగిలి జీవులఁ జంపు
దీనిభావ మేమి? తిరుమలేశ!

(వల)

---

# లఘుటీక.

## ౧ ఆశ్వాసము.

పద్యము—1. ధీజడిమ=బుద్ధిమాంద్యము. 3. జీర్ణభావంబు=వాడి (నేలరాలి) పోవుట. 4. అర్క కాంతము=సూర్యకాంతపుఱాయి, సవితృపాదములు=సూర్యకిరణములు. 6. తృటియ మే=మాడవదితమే (నశించుటయే) 7. చారు...మస్తకంబు=సుందరమైన మణిచేత నలంకరింపఁబడిన నుతింపఁదగిన శిరస్సు; పన్నగము=పాము. 8. దిన పూర్వ పరభాగజనితము=దినముయొక్క మొదటి, చివరభాగములందు పుట్టినది. 9. మృగతృష్ణ=ఎండమావులు. 11 దృప్తుఁడవై=గర్వించినవాఁడవై; నితాంత=గాఢమైన. 12 మృణాళగుణము=తామరతూఁటిదారము. వారణము=ఏనుఁగు; వారణంబె=అడ్డపెట్టునదా? 13 పుష్కల=పూర్ణమైన: ఆజి=యుద్ధము. 14. మహా మహీధర అశ్మసంఘాత కర్కశంబు=గొప్ప కొండఱాళ్లసమూహమువలెనే కఠినమైనది. 15 తప్తలోహము=కాల్పఁబడిన వెండి బంగారు లోహము నది; నళినీదళసంస్థితము=తామరాకున నిలిచినది; శుక్తి=ముత్తెపుచిప్ప. పౌరుషవృత్తులు=పురుషుల వ్యాపారములు; 16. అతితర=మిక్కిలియెక్కువయైన; గురుత=గురుత్వము=బరువు. 18. ద్యుమణి=సూర్యుఁడు; పద్మాకరము=చెఱువు; అమృతసూతి=చంద్రుఁడు; అంబుధరుఁడు=మేఘుఁడు. 19. అఘము=పాపము; గోప్యంబు=కాఁపఁదగినది [రహస్యము]; ఆపన్నుని=ఆపదపొందినవానిని, లేవడి=పేదతనము 20. ఉదధి=సముద్రము 21 ఉత్కృష్ట+శాలి+ఓదనంబు=గొప్పదైన వరియన్నము 23. తృష్ణ...కీలలు=అగ్నిదేవుని...లు.

## భాస్కర శతకము.

పద్యము—1. అక్కఱపాటు=నిమిత్తము; నిదానమ
ఆలోచించఁబడఁగినది (దృష్టాంత మని భావము) 3 పొత్తుగ
పొందక (అతుకొనక) 4. తేజము=ప్రభావము; తిరిమ్మ
(దేశ దేశములు) తిరిగి; కొల్లదుక పోఁగొట్టుకొనును; వనికి
అడవికి 5. ఒడ్లు=ఇతరులు. 6 టంకము=రూపాయలో వ
దవవంతు గల బంగారు నాణెము; నిబద్ది=నిజము. 7. ఎ
నీచుఁడు. 10. అకుంఠిత=వ్యర్థముగాని. 12 గంధగజం
మదించిన యేనుఁగు. 13 రసజ్ఞత=రసము ను తెలిసికొను[శక్తి
14. తెగరు=గొఱ్ఱె 15. తత్త్వము=స్వభావము. 18. దక్షుఁ
సమర్థుఁడు; పలాయనము=పాఱిపోవుట; వాఁగులు=సెలఏ
19. వదాన్యుఁడు=దాత; అంబుధి=సముద్రము. 20
వుల=మాలల. తక్షజులు=వంశితులు. 21. పాడి=ధర్మ
మతిభాసురుఁడు=బుద్ధిచేతఁ బ్రకాశించువాఁడు, గుణప
ర్ణుఁడు=మంచిగుణములచె నిండినవాఁడు. 22. పూరిత
గుణుఁడు=నిండఁబడిన మంచిగుణములు గలవాఁడు [
గుణములు నిండి యున్నవాఁ డనుట.] గొగ్గులు=ముడుత
లు [గలవి] 23. జ్వలనుఁడు=అగ్ని దేవుఁడు. 24
డుఁడు=బలవంతుఁడు. రచ్చ=సభ. గంజల్లునె=ప్రకాశించు
25. సన్ముని సేవ్య=సన్మార్గులగు మునీశ్వరులచే సేవింప
వాఁడా! 26. సుశ్లోకుఁడు=మంచినడవడి గలవాఁడు. 27
చుఁడు=కృశించిపోవుచు; అతి+అధమవర్తనుఁడు=మిక్కిలి
హీనమైన నడవడి గలవాఁడు. మహత్+ఉన్నతత్వమున్

దైనపోవుగును. 28. క్రూరసంగతి=దుర్మార్గులతోడి సహవాసము. 29. చిల్లపిత్తు=ఇందుగుగింజ. 31. స్ఫురతర=మిక్కిలి ప్రకాశవంతమైన. మణికీలిత+అంగుళ+ఆభరణములు=మణులతోఁ జెక్కఁబడిన వ్రేళ్లనగలు (ఉంగరములు). 32. కట్టడయైన=(విధిచే) ఏర్పాటైన.

## దాశరథి శతకము.

పద్య—1. చిన్మయరూప=జ్ఞానమే ఆకారముగాఁ గలవాఁడా! కిల్బిషవ్రజవిపాటనము=పాపసమూహమును వదలించుట. 2 కలశాంబుధిసోమ=పాలసముద్రమునకుఁ జంద్రుఁడవైనవాఁడా! దోర్బలోద్దామవిరామ=బాహుబలము యొక్క స్వాతంత్ర్యము నణఁచినవాఁడా! పక్షిరాడ్ధ్వజ=గరుత్మంతుఁడు టెక్కెముగాఁ గలవాఁడా? 4. హాలికునకున్=సేద్యగానికి. హాలాగ్రము=నాఁగటికొన. సురాపగ=ఆకాశగంగ. 5. కింకరోత్కరములకున్=భటసమూహమునకు. 6. విమలమేచకరూపసుధారసంబు=స్వచ్ఛమైన నల్లని యాకార మనియెడి అమృతరసము 7. ఆదిజరోగముల్=మొదటఁ (బాల్యమునఁ) బుట్టినవ్యాధులు 8. అజాండ=బ్రహ్మాండ. 9. దుఃఖవీచికల్=కష్టములను కెరటములు. 13. దుర్మార్గవితర్క=దుర్మార్గపు తలంపులుగలవానినిగా. 14. వాసవ=ఇంద్రునియొక్క. 15. అళుతన్=కంఠము నందు.

## భారతనీతులు.

1. ఐహిక+ఆముష్మిక=ఈలోకసంబంధములును, పరలోకసంబంధములును (ఐన). ఇరుగడలన్=రెండువైపులను.

భాస్కర శతకము.

పద్యము—1. అక్కఱపాటు=నిమిత్తము; నిదానము= ఆలోచింపఁదగినది (దృష్టాంత మని భావము) 3 హత్తుగడ= పొందిక (అతుకొనుట) 4. తేజము=పరిభావము; తిరిమ్మరి= (దేశదేశములు) తిరిగి; కోల్పడుక పోఁగొట్టుకొనును; వనికిక= అడవికి 5. ఒడ్లు=ఇతరులు. 6 టంకము=రూపాయలో మూఁడవవంతు గల బంగారు నాణెము; నిజద్ది=నిజము. 7. ఎడ్డె= నీచుఁడు. 10. అకుంఠిత=వ్యర్థముగాని. 12 గంధగజంబు= మదించిన యేనుఁగు. 13 రసజ్ఞత=రసము ను తెలిసికొను[శక్తి]ట. 14. తగరు=గొఱ్ఱె 15. తత్త్వము=స్వభావము. 18. దక్షుఁడు= సమర్థుఁడు; పలాయనము=పాఱిపోవుట; వాఁగులు=సెలయేళ్లు. 19. వదాన్యుఁడు=దాత; అంబుధి=సముద్రము. 20 నుడువుల=మాటల. తజ్ఞులు=పండితులు. 21. పాడి=ధర్మము. మతిభాసురుఁడు=బుద్ధిచేతఁ బ్రకాశించువాఁడు, గుణపరిపూర్ణుఁడు=మంచిగుణములచె నిండినవాఁడు. 22. పూరితసద్గుణుఁడు=నిండఁబడిన మంచిగుణములు గలవాఁడు [మంచి గుణములు నిండి యున్నవాఁ డనుట.] గొగ్గులు=ముడుతముడుతలు [గలవి] 23. జ్వలనుఁడు=అగ్నిదేవుఁడు. 24. బల్లిదుఁడు=బలవంతుఁడు. రచ్చ=సభ. రంజిల్లునె=ప్రకాశించునా? 25. సన్మునిసేవ్య=సన్మార్గులగు మునీశ్వరులచే సేవింపఁబడువాఁడా? 26. సుశ్లోకుఁడు=మంచినడవడి గలవాఁడు. 27. వట్టుపోక=కృశించిపోవుచు. అతి+అధమవర్తనుఁడు=మిక్కిలి నీచమైన నడవడి గలవాఁడు. మహత్+ఉన్నతత్త్వమున్=గొప్ప

దైనసహాయమగును. 28. క్రూరసంగతి=దుర్మార్గులతోడి సహవాసము. 29. చిల్లపిత్తు=ఇందుగుగింజ. 31. స్ఫురతర=మిక్కిలి ప్రకాశవంతమైన. మణికీలిత+అంగుళ+ఆభరణములు=మణులతోఁ జెక్కఁబడిన వ్రేళ్లనగలు (ఉంగరములు). 32. కట్టడయైన=(విధిచే) ఏర్పాటైన.

## దాశరథి శతకము.

పద్య—1. చిన్మయరూప=జ్ఞానమే ఆకారముగాఁ గలవాఁడా! కిల్బిషవ్రజవిపాటనము=పాపసమూహమును వదలించుట. 2 కలశాంబుధిసోమ=పాలసముద్రమునకుఁ జంద్రుఁడవైనవాఁడా! దోర్బలోద్దామవిరామ=బాహుబలము యొక్క స్వాతంత్ర్యము నణఁచినవాఁడా! పక్షిరాడ్ధ్వజ=గరుత్మంతుఁడు టెక్కముగాఁ గలవాఁడా! 4. హలికునకున్=సేద్యగానికి. హాలాగ్రము=నాఁగటికొన. సురాపగ=ఆకాశగంగ. 5. కింకరోత్కరములకున్=భటసమూహమునకు. 6. విమలమేచకరూపసుధారసంబు=స్వచ్ఛమైన నల్లని యాకార మనియెడి అమృతరసము 7. ఆదిజరోగముల్=మొదటఁ (బాల్యమునఁ) బుట్టినవ్యాధులు 8. అజాండ=బ్రహ్మాండ. 9. దుఃఖవీచికల్=కష్టములను కెరటములు. 13. దుర్భావితర్కు=దుర్మార్గపు తలంపులుగలవానినిగా. 14. వాసవ=ఇంద్రునియొక్క. 15. అలుతన్=కంఠము నందు.

## భారతనీతులు.

1. ఐహిక+ఆముష్మిక=ఈలోకసంబంధములును, పరలోకసంబంధములును (ఐన). ఇరుగడలన్=రెండువైపులను.